REGD. No. MNL 18 ESTD: 1930 21-9-1990 శుక్రవారం రు. 1.50 లు

# జమీన్ రైతు



సంపుటి: 61 సంచిక 88 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరు నరేంద్రప్రసాద్

# పోటీ కాంగ్రెస్ శాసనసభ పార్టీ?

(మా హైదరాబాదు విలేఖరి)

డాక్టర్ చెన్నారెడ్డి నాయకత్వానికి సవాలుగా పోటీ సి. ఎల్. పి ని ఏర్పాటు చేయాలని అసమ్మతివాదులు ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ నెల 20 వ తేదీ శ్రీ పి శివశంకర్ రంగంలోకిదిగి పోటీ సి. ఎల్. పి ఏర్పాటుకు పథుంకట్టడంతో అసమ్మతీయులకు కొండంత బలంవచ్చింది చెన్నారెడ్డిని వ్యతిరేకిస్తున్న ఎమ్మెల్యే

## చెన్నారెడ్డికి వ్యతిరేకంగా శివశంకర్ రంగంలో దిగాడు!

నుంచి అసెంబ్లీ సమావేశాలు ప్రారంభం కానున్న నేపథ్యంలో పోటీ లెజిస్లేచర్ పార్టీ నిర్ణయం అధికారపక్షం గుండెల్లో గుబులుపుట్టిస్తోంది. చెన్నా నాయకత్వానికి గండికొట్టేందుకు మాజీ కేంద్ర మంత్రి లందరూ ఒకజట్టుకట్టి అసెంబ్లీలో సహాయ నిరాకరణ చేపట్టడం ఈ పోటీ సి ఎల్ పి ఉద్దేశ్యం ప్రతిపక్షాలనుంచి వచ్చేవిమర్శ లకు స్పందించకుండా, సమయం వచ్చి నపుడు చెన్నారెడ్డిని, ఆయన మద్దతు దార్లను ఇరకాటంలో పెట్టాలన్నది అసమ్మతీయుల వైఖరిగా కనబడుతోంది. చెన్నా నాయకత్వాన్ని ఇరకాటంలో పడేసేందుకు పోటీ సి. ఎల్. పి. తప్ప మరో మార్గం లేదని శివశంకర్ భావిస్తున్నట్లు తెలుస్తోంది. అయితే శివశంకర్ వ్యూహానికి అధిష్టానవర్గం అనుమతి ఉందా లేదా తెలియరావడంలేదు. అసమ్మతీయులతో శివశంకర్ మాట్లాడుతున్న తీరుచూస్తుంటే మాత్రం పరోక్షంగా అధిష్టానవర్గం ఆశీస్సు లున్నట్లే తోస్తోంది. అయితే పోటీ సి. ఎల్. పి. ఏర్పాటుకు ఎంతమంది ఎమ్మెల్యేలు ముందుకు వస్తారన్నది ఇదమిద్ధంగా తెలియటంలేదు ఇలా చేయటంవల్ల చెన్నారెడ్డిని ఇరకాటంలో పెట్టడం అటుంచి ఏకంగా ప్రభుత్వానికే ముప్పు

—8 వ పేజీలో

## సిఎల్‌పి త్రయంపై అసమ్మతీయుల కన్నెర్ర

20 తేదీ నుంచి ప్రారంభం కానున్న అసెంబ్లీ సమావేశాల్లో మంత్రులు, శాసన సభ్యుల మధ్య 'సయోధ్య' కుదిర్చి ప్రతి పక్షాల దాడిని తిప్పికొట్టేందుకు సి ఎల్ పి నేత డాక్టర్ చెన్నారెడ్డి ముగ్గురు మంత్రులతో శాసనసభ సమన్వయ ఉపసంఘాన్ని నియమించారు. ఇందులో శ్రీ కె. జానారెడ్డి, శ్రీ డి. శ్రీనివాస్, శ్రీమతి ఉమా వెంకట రామిరెడ్డి సభ్యులుగావున్నారు. శాసనసభ అనుభవాన్ని బట్టి చూస్తే ఇందులో శ్రీ జానారెడ్డికి మాత్రం అనుభవంవుంది. శ్రీనివాస్ శాసనసభకు పూర్తిగా కొత్త, ఇక ఉమా వెంకటరామిరెడ్డికి ఎమ్మెల్యేగా అను

### హైదరాబాదు వర్తమానం

భవం ఉన్నప్పటికీ శాసన సభ్యులను కలుపుకుపోయేంత తీరిక ఆమెకులేదు జానారెడ్డిని మినహాయిస్తే మిగతా ఇద్దరు

—8 వ పేజీలో

# నెల్లూరు రాజకీయాల్లో

విహంగవీక్షణం

## జనార్ధనరెడ్డి

ఉన్నత విద్యాశాఖ మంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి 20 తేది ఉదయం విధవత్ మీదుగా నెల్లూరు వచ్చారు. జాలిరెడ్డిపాలెం, తూపిలిపాలెం, దిల్లిగూడు వగైరా గ్రామాంతరల్లో పర్యటించి సాయంత్రం నెల్లూరులో రెండు ప్రైవేటు కార్యక్రమాలకు హాజరువేసుకొని, రాత్రికి వాకాడులో సమాజం లేదు; వేకువజామునే వాయుమార్గాన రాజధానికి వెళ్ళిపోయారు.

## నీళ్ళు వదిలారు

నెల్లూరు తాలూకాలోని జాఫర్ సాహెబ్ కాల్వ, సర్వేపల్లి కాల్వలకు 15తేది రాత్రి నీరు వదిలారు. దుక్కులకు పుష్కలంగా నీరు అందుతున్నదని, నారు వేతలు ఉధృతంగా సాగుతున్నాయని, ఉత్తరాదినుండి వస్తున్న సాయకూలీలు పుష్కలంగా వచ్చి వెందుకు కూలీలకొరత కూడా లేదని రైతులు చెప్తున్నారు.

సమీపపు గ్రామాలకు నీరు అందుతున్నదేమోగాని, కొన గ్రామాంతరకు చాలినంత పోతున్నట్లులేదు. వర్షంవుంటే తప్ప కాల్వలకు ఎంత ఎక్కువనీరు వచ్చినా వేతలు సాగవు. కాల్వనీళ్ళకు వర్షమూ తోడైతే నారువేతలు త్వరగా పూర్తి అవుతాయి. వర్షం లేకుండువల్ల నాటినపైర్లుకూడా అంత బాగ లేవంటున్నారు.

సోమశిల రిజర్వాయరు నీటిమట్టం గత వారంకంటే ఒక టి.ఎం.సి. పెరిగింది, రిజర్వాయరులోకి పైనుంచి ఎన్ని నీళ్ళు వస్తున్నాయో క్రిందకు అన్ని వదులుతున్నారు. కాని రిజర్వాయర్ల నీటిమట్టం మాత్రం గతవారానికంటే తగ్గింది.

కె సి కెనాల్ నీటిని పెన్నకు వదలవలసిందిగా నెల్లూరు ఇర్రిగేషన్ శాఖ కోరుతున్నదని, ప్రభుత్వం నుండి ఎటువంటి సమాధానం రాలేదని తెలుస్తున్నది. నారువేతలు సాగినా వాతావరణ పరిస్థితి ఈ విధంగానే వుంటే పైర్లు దెబ్బతినిపోతాయని రైతులు ఆందోళన చెందుతున్నారు. నెల్లూరు మంత్రులు, శాసనసభ్యులు కలిసి కడప కర్నూలు శాసనసభ్యులను ఒప్పించగలిగితే కె సి కెనాల్ నీరు రావడం సులభతరమవుతుంది.

## మనసు, నెత్తురు మారితే?

తుఫాను నిధులతో జరగవలసినపనులకు అక్టోబరు 2 తేది ముఖ్యమంత్రి చెన్నారెడ్డి ప్రారంభించవలసిన తర్వాత ఇతర మంత్రులు జరిపేవరకు ముందుగానే వేయకూడదని మంత్రి శ్రీ శ్రీనివాసులురెడ్డి అటుపిటు ఏస్ సెక్రెటరీకి ఒక జాబు వ్రాసి, ప్రజలకు తెలిసేందుకు పత్రికలకు విడుదలచేశారు.

తనను పాలనానికి తొక్కిన చెన్నారెడ్డి మీద గౌరవంతో శ్రీనివాసులురెడ్డి ఈ విధంగా ఆక్షేపించవలదు; నెల్లూరు జిల్లాలో రాజ్యాన్ని మరోమంత్రి వేసేస్తున్నాడే అనే ఈర్ష్యాసూయలతో వెళ్ళగక్కుతున్న ఆక్రోశము ఇది!

జనార్ధనరెడ్డిమీద శ్రీనివాసులురెడ్డిలో, శ్రీనివాసులురెడ్డిమీద జనార్ధనరెడ్డిలో పేడ కాని గడ్డకట్టి, రక్తంలోని ప్రతి అణువులో కలిసిపోయిన పరస్పర ద్వేషాసూయలు, పగలు ప్రతీకారాలను తొలగించుకుకపోతే ఏమీలేదు. ఇష్టులైపోయిన మనసులు స్థానంలో మకరందపూరితమనసులను అమర్చి, విద్వేషకణాలతో నిండిన రక్తంబదులు పరిశుద్ధమైన కొత్త రక్తాన్నినింపే ప్రక్రియ వుంటేబాగుంటుంది. అందులో మూతంటికిన్ని ఇద్దరికి ఒక్క రోజులో కాకుండా, ఒకరికి అమెరికాలో జరిగితే, మరొకరికి రష్యాలో జరగాలి!

అదేమిటాతకమోగాని శ్రీనివాసులురెడ్డిగారితో పెరిగే పత్రికానాయకుడు ఒక అమ్మరాజనం స్ట్రింగ్ సీసా దగ్గరవుంచుకొంటానన్నాడు!

## ఎ. సి. వర్ధంతి

ఈలోకం వదలిపోయి రెండున్నర దశాబ్దాలు కావస్తున్నా - ఈనాటికీ నెల్లూరియుల హృదయాలలో సజీవంగావున్న మహానాయకుడు స్వర్గీయ ఎ సి సుబ్బారెడ్డి 22వ వర్ధంతి, 20 తేది ఘనంగా జరిగింది. ఆనం వివేకానందరెడ్డి చొరవతో పునఃప్రారంభమైన ఈ వర్ధంతి సభలకు ఈసారి స్పెషల్ ఆకర్షణగా - వికలాంగులు ముగ్గురికి సైకిల్ ఉర్చ్యలు ఇచ్చారు. పారిశ్రామికవేత్త శ్రీ మాగుంట శ్రీనివాసులురెడ్డి వీటిని వికలాంగులకు అందజేశారు. అల్నే - పెద్దాసుపత్రి సాయిబాబామందిరం, రైల్వేస్టేషన్లకు నాలుగు వీల్ చేర్స్ - ఎమ్మెల్యే శ్రీ జె కె రెడ్డి చేతులమీదుగా బహూకరింపజేశారు.

ఉదయం ఎ సి విగ్రహాన్ని భారీగా పూలమాలలతోముంచెత్తారు; అప్పుడే 6 వేల మందికి అన్నదానం. సాయంత్రం ధగధగాయమానంగా అలంకరించిన వేదికమీద చిన్న సభ. ఆదర్శ రైతుగా ఎంపికజేసిన శ్రీ సామంతు గోపాలరెడ్డిని స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ ఈదూరు సుందరరామరెడ్డి సత్కరించారు; ఆయన్ను శ్రీ ఆనం రామనారాయణరెడ్డి శాలువతో సన్మానించారు. ఎ సి ఆప్త అనుచరుడు శ్రీ పుట్టా బలరామరెడ్డి సభనధ్యక్షించారు. శ్రీ పి. రామవరెడ్డి స్వాగతం, మాధవయ్య వర్కి షర్ షాప్ విజయకుమార్ వందనాలు చెల్లించారు.

ఎ సి పేరు శాశ్వతం చేయడానికి ఏదైనా బృహత్ సంస్థ స్థాపనకు వివేకానందరెడ్డి పూనుకోవడం బాగుంటుంది.



వర్ధంతి సందర్భంగా ఎ సి బొమ్మకు పూలమాలవేసి శ్రద్ధాంజలి ఘటిస్తున్న ఆనం వివేకానందరెడ్డి, ఎమ్మెల్యే జెకెరెడ్డి, ఆనం విజయకుమారరెడ్డి, పి. రాఘవరెడ్డి

## జిప్రప మీటింగులో జమీన్ రైతు ప్రస్తావన

వర్షపండకాల్యాంతు ఇచ్చే తుఫాను నిధులతో గూడూరు డివిజనులో మాత్రం పనులు చేపట్టాలని ప్రభుత్వం చేసిన నిర్ణయంపై జమీన్ రైతు చేసిన విమర్శ- మొన్న 15 తేది జరిగిన జి ప్ర ప సమావేశంలో ప్రముఖంగా ప్రస్తావనకువచ్చింది. నిధులను గూడూరు తరలించుకపోవడంపై మాట్లాడుతూ శ్రీ జె కె రెడ్డి, శ్రీ మాదాం జానకిరాం తదితరులు జమీన్ రైతు తమను చేతకానివారిగా వర్ణించిందని, దద్దమ్మలన్నారని - పత్రికా విమర్శలకు ప్రజలలో కూడా నెల్లూరు, కావలి డివిజన్ ఎమ్మెల్యేలపై అటువంటి అభిప్రాయమే ఏర్పడుతున్నదని, నిధుల విషయంలో మావద్దకంటే తాము సహించేది లేదని హెచ్చరించారు. ఈ నిధుల గొడవేదో తనకు తెలియదని, తనకు శిక్షవర్ధని మంత్రి శ్రీ జనార్ధనరెడ్డి అన్నారు.

మాటల ఆగంతప్ప, నిధులపంపకంలో నెల్లూరు, కావలి డివిజన్లకు జరిగిన అన్యాయాన్ని సరిదిద్దే నిర్ణయంమాత్రం తీసుకోలేదు. కోటలో అక్రమంగాపెట్టిన సైక్లోన్ పునరావాస డివిజనల్ కార్యాలయాన్ని, ఆర్ అండ్ బి ఇఇ ఆఫీసును తక్షణం అక్కడనుంచి తరలించాలని మాత్రం సమావేశంలో తీర్మానం చేశారు.

## డీసల్ కరువు

నెల్లూరులో డీజలాయిలుకు తీవ్రమైన కరువు ఏర్పడివుంది. పెట్రోలు బంకుల ఎదుట లారీలు, బస్సులు ఫర్లాంగుల పొడుగున బార్లుతీరుతున్నాయి. ట్రాక్టర్లవారి అవస్థ వర్ణనాతీతం. రైతులు క్యాన్లు పట్టుకొని బంకులచుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు; పడిగాపులు కాస్తున్నారు ఈ కొరత ఫలితంగా ట్రాక్టర్లు, లారీలతోపాటు ట్యాక్సీలు కాడుగలుకూడా ఆగిపోయాయి.

ఇంతకూ ఈ కొరతకు కారణమేమిటో అర్థంకావడంలేదు. పెట్రోలు బంకులవాడు చెప్పడం - మద్రాసు కంపెనీలో

—కొరవ 8వ పేజీలో







Government of - India Ministry of Communications
Telecommunications-Andhra Pradesh
(Office of the Telecom District Engineer,
Nellore-524 050)
Memo No P. 21/TD-1990/4 dated at Nellore
15-9-1990

## NOTICE

Nellore Telecom District Telephone Directory 1990 issue is going to be published and likely to be released shortly. Advertisements will be accepted for publication in the Telephone Directory 1990 issue. Intending advertisers may contact the Deputy Telecom District Engineer, Nellore-524-050 for application forms, Tariff and other details. The last date for receipt of advertisement is 16-10-1990

Telephone Subscribers of Nellore Telecom District are also hereby requested to intimate the undersigned any changes in their names and addresses or corrections, if any, immediately.

Telecom District Engineer,
Nellore-524 050

